## శ్రీమణవాళమహామునులు



శ్లో॥తులాయామతులేమూలేపాణ్డ్యేకున్తీపురేవరే।శ్రీశేషాంశోద్భవంవన్దేరమ్యజామాతరంమునిమ్॥

వీరు విశిష్ఠాద్వైత మతం నందలి శ్రీవైష్ణవ తేంగల శాఖలో ప్రముఖమైన స్థానాన్ని సుస్థిరపరచు కొన్నారు.వీరు క్రీ.శ.1370 మరియు క్రీ.శ.1444 మధ్యకాలంలో జీవించారు.ఇతనిది ఆదిశేషుని అవతారమని ప్రతీతి.శిరోభాగమున ఆదిశేషుడు,చేతిలో త్రిదండము, కాషాయ వస్త్రాలు,హృదయంపై రంగనాథహారం. ఇవి శ్రీమణవళమహాముని చిహ్నాలు.వీరి తండ్రి తిగళాక్కిదంతన్ తిరునవీరుడైయ పిరన్ తాడర్ అన్నార్, తల్లి శ్రీరంగ నాచ్చియార్ .వీరు శ్రీవైష్ణవ తేంగల శాఖలోని గోమఠంవంశంలో కౌండిన్యస గోత్రంలో సాధారణ నామ సంవత్సరంలో తులా(అల్పిశి-తమిళమాసం) మాసమందలి 26వరోజు (చాంద్రమాస తిథి చతుర్థి),మూలా నక్షత్రం, సుకర్మ యోగంలో గురువారం నాడు తమిళనాడులోని ఆళ్వార్ తిరునగరిలోజన్మించారు.వీరికి వీరి తండ్రి 'అళగియ మణవాల పెరుమాళ్ నాయనార్' అని నామకరణం చేశారు.వీరు రమ్యజామాతృ,సౌమ్యజామాతృ,యతీంద్ర ప్రవణ, వరయోగి,వరవరముని మరియు విశద వాక్శిఖామణి అను పేర్లతో కూడా ప్రసిద్ధులు.వీరికి తండ్రి పెట్టిన పేరు అళగియ మణవాలన్ అనేది శ్రీరంగనాథుని స్ఫురింపజేస్తూ 'సుందరజామాతృ' అందమైన పెళ్ళికొడుకు అనే అర్థాన్ని కలుగజేస్తుంది. వీరి బాల్యంలో విద్యాభ్యాసం తన తండ్రి వద్ద మరియు మాతమహుని వద్ద జరిగింది.అందులో భాగంగా వీరు వేద,వేదాంగాలు మరియు దివ్య ప్రబంధాన్ని క్షుణ్ణంగా అభ్యసించారు.వీరికి పంచసంస్కారదీక్ష ప్రసాదించిన గురువులు తిరువాయ్ మొళి పిళ్ళై.వీరినే శ్రీశైలాచార్య(శ్రీశైలేశులు) అని కూడా అంటారు.తిరువాయ్ మొళి పిళ్ళై ఆళ్వార్ తిరునగరిలో శ్రీరామానుజుల యొక్క దేవాలయం మరియు అర్చామూర్తిని నిర్మింపతలపెట్టి ఆ కార్యాన్ని మణవాళమహామునికి అప్పగించగా వీరు రామానుజులపై అమితమైన భక్తి ప్రపత్తులతో ఆ కార్యాన్ని పూర్తి దక్షతతో పూర్తిచేసినందువల్ల శిష్యవాత్సల్యంతో వీరికి "యతీంద్రప్రవణ" అనే బిరుదును ప్రసాదించారు.ఈ సమయంలోనే వీరు 'యతిరాజ వింశతి'ని రచించారు.

శ్రీరామానుజులవారే మణవాళమహామునిగా -వారేవీరుగా (అవరే ఇవర్-తమిళం) అవతరించారని భాగవతోత్తముల అచంచల విశ్వాసము. ఉపనిషత్తులలోని రహస్యార్థాలను చక్కగా విశదపరచినందువల్ల 'విశదవాక్శిఖామణి' గా ప్రఖ్యాతి చెందారు.

వీరి భాగవత గోష్ఠులు ప్రసిద్ధములు. శ్రీరంగనాథులవారే స్వయంగా మారు వేషంలో తన పరమ భక్తుడైన వీరి గోష్ఠులలో పాల్గొనెడివారని ప్రతీతి.ఒకసారి ఒక బాలుని రూపములో వచ్చి "శ్రీశైలేశదయాపాత్రంధీభక్త్యాదిగుణార్ణవమ్। యతీంద్రప్రవణం వందేరమ్యజామాతరంమునిమ్॥" అనే ఈ శ్లోకాన్ని స్వయంగా తనే మణవాళమహామునివర్యులకు ఇచ్చారని కథనం.దీనినిబట్టి ఈ శ్లోక కర్త శ్రీరంగనాథుడే అని అవగతమౌతున్నది.ఈ శ్లోకాన్ని దక్షిణభారతంలోని అన్నిపాంచరాత్ర సాంప్రదాయ వైష్ణవాలయాల్లోని అర్చకస్వాములు తరతరాలుగా పఠించడం మనకు అనుభవమే.

వీరి గురువైన తిరువాయ్ మొళి పిళ్ళై తన అవసాన దశలో వీరిని శ్రీరంగం వెళ్ళి శ్రీభాష్యం ను అధ్యయనం చేసి శ్రీభాష్యానికి మరియు దివ్య ప్రబంధానికి విస్తృత ప్రచారం కల్పించి శ్రీరంగం లోనే నివసించి శ్రీరంగనాథుని సేవించవలసిందిగా ఆదేశించగా వీరు తన గురువుగారి అభీష్టం ప్రకారం అలాగే శ్రీభాష్యానికీ మరియు దివ్యప్రబంధానికి విస్తృత ప్రచారం కల్పించి తన అవతార సమాప్తి వరకు శ్రీరంగనాథుని సేవలోనే తరించారు. తమ గురువు అభీష్టంమేరకు వీరు శిష్యులతో సహా శ్రీఆండాళ్ జన్మస్థలమైన శ్రీవిల్లిపుత్తూర్ ను దర్శించి శ్రీఆండాల్ ని సేవించి తిరిగి శ్రీరంగం చేరుకున్నారు.తిరిగి వీరు తిరుమలను దర్శించి శ్రీవేంకటేశ్వరస్వామిని సేవించుకున్నారు.కాంచీపురానికి వెళ్ళి వరదరాజ పెరుమాళ్ ను సేవించుకొని ఆయన వైభవాన్ని వర్ణిస్తూ "దేవరాజ మంగళం" ను రచించారు.పిదప శ్రీపెరుంబూదూర్ కు వెళ్ళి కిడాంబి నాయనార్ వద్ద శ్రీభాష్యం అభ్యసించడానికి శ్రీరామానుజుల అనుమతి పొందారు.

వీరి బోధనాపటిమ వీరికి అనేకమంది శిష్యులను చేర్చింది.వారిలో ముఖ్యులు అళగియ వరదర్.వీరు మణవాళ మహాముని వద్ద శిష్యునిగా చేరి, సన్యసించి,సన్యాసాశ్రమంలో "రామానుజ జీయర్" పేరుతో ప్రసిద్ధి పొందారు.వీరు జీయర్ మఠాన్ని, వానమామలై మఠాన్ని స్థాపించారు.ఆ రెండు మఠాలిప్పుడు శాఖోపశాఖలుగా విస్తరించి నిరంతరాయంగా కొనసాగుతున్నాయి.

వీరు లోకాచార్య పిళ్ళై గారి రహస్య గ్రంథాలైన 1.ముముక్షుపడి 2.శ్రీవచనభూషణం 3.తత్త్వత్రయం లకు విపులమైన భాష్యం వ్రాశారు.అరుళాలప్ పెరుమాళ్ ఎంపెరుమానార్ గారి జ్ఞానసారం మరియు ప్రమేయసారం గ్రంథాలకు భాష్యం రచించారు. లోకాచార్య పిళ్ళై సోదరుడైన అళగియ మనవాళప్పెరుమాళ్ నాయనార్ గారి ఆచార్య హృదయం గ్రంథానికి అయీ జనన్యాచార్య స్వామితో కలిసి సంయుక్తంగా వ్యాఖ్య వ్రాశారు. పెరియాళ్వార్ గారి తిరుమొళి గ్రంథాన్ని కూడా వ్యాఖ్యానించారు.రామానుజులవారి నూత్రాంతది పుస్తకానికి కూడా వ్యాఖ్య వ్రాశారు.

ఇవే కాక ఆయన కొన్ని తను స్వయంగా వ్రాశారు(స్వతంత్ర రచనలు). అవి- 1.ఉపదేశరత్నమాల, 2.తిరువాయ్ మొళి నూత్రంతది, 3.ఇయల్ సత్తు, 4.తిరువారాధనక్రమం, 5.యతిరాజవింశతి, 6.దేవరాజమంగళం, 7.శ్రీకంచిదేవప్పెరుమాళ్ స్తోత్రం,8.ఆర్తి ప్రబంధం.

వీరు తన అవసాన దశలో పైబడినవృద్ధాప్యంతో బాధపడతూ ఆలయానికి వెళ్ళి భగవదర్శన చేయలేనంత అశక్తతో ఉండి, వైకుంఠానికి చేరుకోకుండా ఇంకా ఈ లోకంలో ఉన్న తన దయనీయ స్థితిని రోజుకొక పద్య రూపంలో రామానుజాచార్యుల వారికి కడు వేదనతో విన్నవించుకొన్నారు.అదియే ఆర్తి ప్రబంధం.ఇది వీరి చివరి రచన.

శ్రీకృష్ణదేవరాయల ఆస్థానంలో అష్టదిగ్గజ కవులు ఉన్నట్లుగానే వీరికి అష్టదిగ్గజాలని చెప్పబడే ఎనిమిది మంది శిష్యులుండేవారు. మొదటి అష్టదిగ్గజాలు కవిపుంగవులైతే,వీరి అష్టదిగ్గజాలు పరమ భాగవతోత్తములు, ముముక్షువులు.వీరు,1.వానమామలై జీయర్,2.పరవస్తు భట్టర్, 3.పిరాన్ జీయర్,4.తిరువేంగడ జీయర్,5.కోయిల్ కందాడై అణ్ణన్,6.ప్రతివాది భయంకరం అణ్ణంగరాచార్య,7.ఎరుంబి అప్పా, 8.అప్పిళ్ళై, 9.అప్పిళ్ళన్.

శ్రీవేంకటేశ్వరసుప్రభాతం వినని తెలుగువారుండరంటే అతిశయోక్తికాదు. ఒక్క తెలుగువారే కాదు తమిళులూ, కన్నడిగులూ, మహారాష్ట్రులూ వీరందరికీ ఇది సుపరిచితమే.ఆకాశవాణి ప్రముఖ కేంద్రాలు ప్రతి శనివారం రోజున ఈ సుప్రభాతాన్ని ప్రసారం చేస్తుంటాయి.ఈ సుప్రభాతం సకలజనుల గుండెల్లోకి వెళ్ళినంతగా ఏ ఇతర ఆధ్యాత్మిక రచన వెళ్ళలేదనడంలో ఏ మాత్రం సందేహం లేదు.అంతగా ప్రాచుర్యం పొందిందీ సుప్రభాతం.

తన గురువుగారి ఆనతితో శ్రీవేంకటేశ్వర సుప్రభాతం,ప్రపత్తి,మంగళాశాసనములను రచించిన ప్రతివాది భయంకరం అణ్ణంగరాచార్యులు కృతార్థుడు, చరితార్థుడూ అయ్యారు. మంగళాశాసనంలో ఒకచోట"శ్రీమత్సుందరజామాతృమునిమానసవాసినే।

సర్వలోకనివాసాయ శ్రీనివాసాయమంగళం॥"అని చెప్పి శ్రీనివాసుడు తన గురువు మానసంలో నెలకొన్నాడని చెప్తూనే ఎల్లలోకాలలో శ్రీనివాసునితో పాటు తన గురువు గారు కూడా నివసిస్తున్నారని లోకానికి చాటుతూ తన గురుభక్తిని ప్రకటించుకున్నారు.

లోకకళ్యాణం కొరకు అవతరించిన శ్రీమణవాళమహామునులు 73 సంవత్సరాలు జీవించి రుధిరోద్గారి సంవత్సరం(Feb-Mar.1444) కుంభమాసం(బహుళ.ద్వాదశి)శ్రవణ నక్షత్రం,శనివారం రోజున సూర్యాస్తమయానంతర కాలంలో అవతార సమాప్తి కావించి ఆదిశేషునిలో లీనమయ్యారు.

శ్లో॥మంగళాశాసనపరైర్మదాచార్యపురోగమైః।సర్వైశ్చపూర్వైరాచార్యైఃసత్కృతాయాస్తుమంగళం॥